# ఆంధ్రప్రదేశ్

# చేతిపరిశ్రమలు



సమాచార పౌర సంబంధముల శాఖ,

ఆంధ్ర ప్రదేశ్, హైదరాబాదు.

# ఆంధ్రప్రదేశ్ చేతిపరిశ్రమలు

భారతదేశంలో చేతి పరిశ్రమలకు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం అగ్రగామి యైవుంది. ఈ రాష్ట్రపు చేతిపరిశ్రమలు విన్నాణంలోను, వైవిధ్యంలోను పేర్వడసినవి. అంతేకాదు, ఇవి ఇచటి సాంస్కృతిక జీవితంలో పెనవేసుకొనిపోయి ఒక సంప్రదాయంగా అనూచానంగా వస్తూవున్నవి. ఇచటి చేతిపరిశ్రమల వస్తువులలో సౌందర్యం, ప్రయోజనం రెండూ చక్కగా సమ్మేళనం చెందాయి. ఈ వస్తువులకు ఆకారంలోనూ, నమూనాలలోనూ ఒక వైశిష్ట్యం వుంది. తెలుపు, నలుపు రంగులతో కూడిన బీదరీ వస్తువులు, చక్కని చేతిపని నగిషీతో అలరారే హిమ్రూ వస్త్రాలు, వెండితీగె కూర్పునైపుణ్యంతో కనులపండువు కొల్పే ఫిలిగ్రీ వస్తువులు, వనమూలికల బంగారు రంగు పూసుకున్న నిర్మల్ వస్తువులు, అవతలి మనిషి కన్పించేంత నాజూకు అల్లికగల లేసులు, మెత్తని అందమైన పోగులతో నేయబడిన తివాచీలు - ఇవన్నీ వాడకం దార్లకూ, వారి ఇండ్లకూ ఎంతో అలంకరణప్రాయ మైనవి.

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో దాదాపు 40 ముఖ్య చేతిపరిశ్రమ లున్నవి. ఇవిగాక లోహపుపని, కొయ్యపని, ఇత్తడిపని, స్టెన్సిల్‌పని, ప్యాకింగ్‌పెట్టెల తయారీ, బంగారు ఆకుల తయారీ, వర్ణచిత్రరచన, సూది పనులు, అందమైన తోలు వస్తువులు, అలంకారాలతో అలరారే మట్టి పాత్రలు, వెదురుపని, బెత్తపు పని, లక్కబొమ్మలు, వేపుపని, ప్రత్యేక వర్ణచిత్రరచన, దీపాలపై ఆచ్ఛాదన వస్తువులు, మేలిరాళ్లపై చెక్కడు పని, అద్దకపు పని, పేపర్ మాచీపని, కాగితపు ఆటబొమ్మలు వంటివి అనేక చిన్న పరిశ్రమలుకూడా ఎన్నో వున్నవి. వీటికి చేతి పరిశ్రమల ప్రణాళికా కార్యక్రమంలో సముచిత స్థానం లభింపవలసి వున్నది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో చేతిపరిశ్రమలకు, ప్రణాళిక కాలానికి, రూ. 35 లక్షలు కేటాయింపబడ్డవి. ఇంతవరకు 25 పథకాలు అమలు జరుపబడ్డవి. ఇంకా 18 కొత్త పథకాలకు మంజూరీ లభించబోతూ వుంది. ఇలా రెండవ ప్రణాళికలో 43 పథకాలు అమలు జరుగుతాయి. ఈ పథకాలలో 17 చేతి పరిశ్రమల వారి సహకార సంఘాలు, 10 సర్వజన సౌకర్య కేంద్రాలు, 6 విక్రయశాలలు, 5 శిక్షణ కేంద్రాలు కూడా చేరివున్నాయి.

## —: చేతి పరిశ్రమల వారికి హెచ్చు ఆదాయం :—

సహకార రంగమూ, పబ్లిక్ రంగమూ కలిసి ప్రతియేటా రూ. 12.05 లక్షలు మొదలు రూ. 15 లక్షల ఖరీదు చేసే చేతిపరిశ్రమల వస్తువులు తయారు చేస్తున్నట్లు అంచెనాలు తెలుపుతూ వున్నవి. వాటిలో రూ. 8.5 లక్షల ఖరీదు చేసే వస్తువులు రాష్ట్ర విక్రయశాలల ద్వారా విక్రయింపబడుతూ వున్నవి. రూ. 2 లక్షల విలువచేసే వస్తువులు నిర్మల్ పరిశ్రమవారి ద్వారా అమ్మబడుతూ వున్నవి. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద ఇంతవరకు 1379 మంది పని వారలకు పనులు దొరికాయి. వారి నెలసరి ఆదాయంకూడా సగటున రూ. 30-40 నుంచి రూ. 35-60 దాకా హెచ్చింది.

వివిధ శిక్షణ కేంద్రాలలో 125 మంది పనివారల పిల్లలు శిక్షణ పొందారు. వారిని వెంటనే చేతి పరిశ్రమల సహకార సంఘాల సభ్యులుగా చేర్చడం జరిగింది. సహకార సంఘాలు ఆధునికమైన పనిముట్లు, యంత్ర సామగ్రిని అమర్చుకోవడానికై వాటికి గ్రాంట్లు ఇవ్వడమైంది. ఇందువల్ల ఆ సంఘాలకు ఉత్పత్తి ఖర్చు తగ్గడమేగాక వాటి ఉత్పత్తి సామర్థ్యం కూడా హెచ్చగలదు.

పథకాలన్నీ ఒక్కొక్క అంశం వారీగా సవివరంగా ఈ పుస్తకం చివర ఒక పట్టికలో చూపబడ్డవి. రెండవ పంచవర్ష ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో చేతి పరిశ్రమలపై పెట్టబడ్డ ఖర్చు రూ. 8.62 లక్షలు. డిజైనుల అభివృద్ధి విషయంలోకూడా గమనించదగిన సత్ఫలితాలు సాధింపబడ్డవి. వివిధ చేతి పరిశ్రమల సాంకేతిక, ఆర్థిక భోగట్టా తీయబడుతూ వుంది. హిమ్రూ వస్త్రములు, బీదరీ వస్తువులకు సంబంధించిన భోగట్టా సేకరణ పూర్తి అయింది. ప్రస్తుత సంవత్సరం నుంచి నాణ్యంగుర్తు పద్ధతి (క్వాలిటీ మార్కింగ్) పథకం కూడా అమలు జరుపబడుతూ వుంది.

---



కొన్ని ప్రత్యేక బిద్రీ పరికరములు

## బి ద్రీ ప రి క ర ము లు

ఉక్కు, లేక రాగి లోహములతో చేయబడిన వస్తువులపై వెండి, బంగారములతో నగిషీపూతపని అరేబ్బి, పర్షియా దేశములలో ప్రాచీనకాలమున అవలంబింపబడుతుండెడిది. బిద్రీ పరికరములలోగూడ ఈ తీరైన కళ ఉన్నది. బిద్రీ పరికరములలో ఉపయోగించునది తుత్తునాగము. తుత్తునాగము కొద్దిపాళ్లు ఇనుప సంబంధముగాని కొన్ని యితర లోహములు చేర్చిన మిశ్రమ లోహము. ఈ మిశ్రమలోహము మొదట బూడిదవర్ణములో ఉండును; తదుపరి లోహపు వర్ణము కారునలుపు రంగులోనికి మార్చబడును. ఈ నల్లటి రంగుమీద చేసిన తెల్లటి వెండిపూతపని చూడ ముచ్చటగా ఉండును. నల్లటి రంగుమీద తీవ్ర తారతమ్యముగల ధవళవర్ణములో వెండితో చేసిన పూతపని గల బిద్రీ పరికరములు అనేక తీరులవి గలవు. ఆధునిక గృహోపయోగ పరికరములపై చేసిన సాంప్రదాయానుసారమైన నూతన నమూనాలు అనేకములు గలవు. మన అభిరుచికి తగిన విధముగా కావలసిన నమూనాలతో పూతపని పురమాయించి చేయించుకొనవచ్చును.

సిగరెట్టు పెట్టెలు, ఆష్ట్రేలు, చిన్నచిన్న ఆభరణపు పెట్టెలు, గాజులు, ట్రేలు, పూలకూజాలు, పళ్ళెరములు, వ్రాతబల్ల పరికరములు (కలము, సిరాబుడ్డి, పేపర్‌వెయిట్ మొదలగునవి) గుండీలు, పిన్నీసులు, బ్రోచీలు మొదలగు వస్తువు లెన్నియో బిద్రీ చేతి పరిశ్రమద్వారా తయారవుతున్నవి.

# ఏటా 1 లక్ష రూపాయల విలువగల బిద్రీ రకములు

## ఎగుమతికి సిద్ధముగా ఉన్నవి

| వివరము | రేటు | | | పరికరము |
|---|---|---|---|---|
| బిద్రీ సిగరెట్ మరియు వెండిపూత చుట్టల కేసులు చేసినవి | రూ. | | | 1కి |
| సైజు 8¼″X5¼″ | 120-00 | నుండి | 180-00 | ,, |
| ,, ,, 6¾″X4¾″X2″ | 60-00 | ,, | 80-00 | ,, |
| ,, ,, 6″X1½″X4″ | 42-00 | ,, | 50-00 | ,, |
| ,, ,, 4¾″X1½″X3½″ | 25-00 | ,, | 30-00 | ,, |
| ,, ,, 7″X 3″X1¾″ | 44-00 | ,, | 50-00 | ,, |
| చిన్న ఆభరణముల నుంచుకొను పెట్టె 3¾″X2½X1½ సైజువి | 12-00 | ,, | 16-00 | ,, |
| ,, 3″X2″X1″ ,, | 9-00 | ,, | 10-00 | ,, |
| పెద్దసైజు మామిడికాయ పెట్టెలు | 10/–50/– | ,, | 12/50 | ,, |
| మామిడి, కోల, తాబేటిచిప్ప ఆకారము గల మధ్యరకపు సైజు పెట్టెలు | 5/40/– | ,, | 7/00/– | ,, |
| తాబేటిచిప్ప ఆకారముగల పెద్దసైజుపెట్టెలు | 21/– | ,, | 30/– | ,, |
| పౌడరు పెట్టెలు వివిధసైజులవి, ఆకారములవి (మామిడి, కోల, తాబేటిచిప్ప మొదలగు ఆకారము గలవి) | 13/- | ,, | 18/– | ,, |
| పై ఆకారములలో చిన్నసైజువి | 3/25/– | ,, | 4/25/– | ,, |
| ఫ్యాన్సీ సిగరెట్ కేసులు | 21/– | ,, | 32/– | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| పుస్తుక ఆకారపు సిగరెట్ పెట్టెలు | 27/– | ,, | 35/– | ,, |
| ఫ్యాన్సీ పళ్ళెరములు వివిధ సైజులవి | 48/– | ,, | 75/– | ,, |
| రాగిచక్రములుగల గుండ్రటి పళ్లెరములు పెద్దసైజువి | 48/– | | | ,, |
| ,, మధ్యరకపు సైజువి | 20/– | | | ,, |
| ,, చిన్నసైజువి | 15/50/– | | | ,, |
| *గుండ్రటి పళ్లెరములు :* | *రేటు రూ.* | | | *పరికరము 1 కి* |
| $6\frac{1}{2}$ అంగుళముల వ్యాసము గలవి | 16/- | నుండి | 21/- | ,, |
| 5 అంగుళముల వ్యాసము గలవి | 8/- | ,, | 12/- | ,, |
| పిన్ను ట్రేలు వివిధాకారములు గలవి చిన్న సైజువి | 2/60/- | ,, | 5/- | ,, |
| ఫ్యాన్సి ఆకారము గల చిన్నసైజు ట్రేలు | 8/- | ,, | 12/- | ,, |
| మధురాహారము లుంచుకొను చిన్న పళ్లెరములు 3 కలిపిన సెట్టు 1 కి | 13/- | ,, | 25-00 | ,, |
| మధురాహారము లుంచుకొను పెద్ద గిన్నెలు | 10-50 | ,, | 17-00 | ,, |
| $7\frac{1}{4}''$ వ్యాసము గల కొక్కెములున్న గుండ్రటి ట్రేలు | 28-00 | ,, | 32-00 | ,, |
| పాదరక్ష ఆకారముగల ఆష్ట్రేలు పెద్దసైజు | 7-50 | ,, | 10-00 | ,, |
| ,, మధ్య రకపు సైజు | 3-20 | ,, | 4-00 | ,, |
| ,, చిన్న సైజు | 2-60 | ,, | 3-00 | ,, |
| గ్లోబు ఆకారము గల ఆష్ట్రేలు | 7-50 | | | ,, |
| నాడపు ఆకారముగల ,, పెద్ద సైజువి | 5-20 | ,, | 7-50 | ,, |
| ,, ,, చిన్నసైజువి | 4-20 | ,, | 5-00 | ,, |
| వివిధాకారములుగల ఆష్ట్రేలు చిన్నవి | 3-70 | ,, | 5-20 | ,, |
| ,, ,, పెద్దవి | 12-56 | ,, | 15-57 | ,, |
| పేపర్ కట్టర్ పెద్దది | 3-20 | ,, | 4-20 | ,, |
| ,, చిన్నది | 1-10 | ,, | 2-25 | ,, |
| పేపర్ వెయిట్ | 4-31 | ,, | 5-25 | ,, |
| పేపర్ క్లిప్పు | 3-25 | ,, | 5-25 | ,, |
| వెండి, బంగారు పూత పనిగల చేతిపని బొత్తాములు: వెండి పూత పనిగలవి | 2-97 | ,, | 3-25 | ,, |
| బంగారు పూత పని గలవి | 10-45 | ,, | 12-56 | ,, |
| అచ్కాన్ బొత్తాములు 7 కి వెండిపూత పని గలవి | 3-77 | ,, | 15-00 | ,, |
| ,, ,, బంగారు పూత పనిగలవి | 26-00 | ,, | 52-50 | ,, |
| చెంచాలు | 2-00 | ,, | 5-33 | ,, |
| నెక్లేసులు | 14-00 | ,, | 18-00 | ,, |
| బ్రోచీలు | 1-60 | ,, | 5-23 | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| చెవులకు ధరించు ఆభరణములు | 2-69 | ,, | 5-33 | ,, |
| ఉంగరములు | 1-60 | ,, | 5-33 | ,, |
| బెల్టు బక్లీసులు | 3-12 | ,, | 5-33 | ,, |
| పూలకూజాలు (అనేక రకములు) | 9-00 | ,, | 325-00 | ,, |
| కూజాలు (సురాయిలు) | 26-00 | ,, | 900-00 | ,, |
| ఫలముల నుంచు గిన్నెలు | 47-00 | ,, | 225-00 | ,, |
| అద్దం ఫ్రేములు | 36-00 | ,, | 85-00 | ,, |
| నేప్కిన్ రింగులు | 3-69 | ,, | 5-33 | ,, |

## నర్సాపురం అల్లిక లేసులు

పశ్చిమ గోదావరి జిల్లాలోని, పాలకొల్లు, నర్సాపురములలో లేసు అల్లిక పరిశ్రమ విస్తారముగా సాగుతున్నది. ఈ పరిశ్రమకు కావలసిన పరికరములు దైమండు దారము, అల్లిక సూదులు మాత్రమే.

చిన్న సైజు తువాళ్ళు, టీ సెట్టు మీద పరచు గుడ్డలు, మేజా బల్ల మీద మధ్య నమర్చు గుడ్డలు, మొదలగునవి ఈ అల్లిక లేసు పనిలో చేయుదురు.

నర్సాపురం అల్లిక లేసులలో కొన్ని నమూనాలు గోడల మీద అలంకరణకు వ్రేలాడ గట్టుటకు చాల అందముగా ఉండును.

అనేక తీరుల వర్ణములలో లేసు పని చేయబడుతున్నది.

విదేశములలో వీటికి గిరాకీ అమితముగా ఉన్నది. విదేశి మారక ద్రవ్యమును సంపాదించుటకు ఈ పరిశ్రమ చాల సహాయకారిగా ఉండ గలదు.

సాలీనా 20 లక్షల రూపాయల విలువ గల వస్తువులను యీ పరిశ్రమ ద్వారా యితర దేశములకు ఎగుమతి చేయ వచ్చును.

నర్సాపురం చేతి లేసు పనులు





నర్సాపురం లేసు పనులు

## లేసుపనుల ధర వివరములు

డజను 1కి ప్రతిన్ ద్రవ్యమానము షిల్లింగులలో దిగువ పట్టికలో చూపబడినవి:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| డాయిలీస్ ( [illegible] పై అం[illegible]ల్లు) | 5'' | 6'' | 8'' | 10'' | 12'' | 16'' |
| | 3/9 | 4/- | 6/- | 10/- | 12/6 | 19/- |
| [illegible] మధ్యగా [illegible] | 18'' | 20'' | 24'' | 30'' | 36'' | 54'' |
| 3ం [illegible] | 27/- | 33/- | [illegible]/- | 160/- | 185/- | 500/- |
| కో[illegible]ఆకారము గలవి | [illegible]x9'' | 7''x10'' | 8''x12'' | 10''x14'' | 12''x16'' | 14''x20'' |
| | 6/3 | 8/- | 12/- | 16/- | 27/- | 39/- |
| [illegible] | 6''x9'' | 7''x10'' | 8''x12'' | 10''x14 | 12''x16'' | 14''x20'' |
| గలవి | 6/3 | 8/9 | 13/- | 17/8 | 28/- | 40/- |
| నలుచదరము గలవి | 6''x6'' | 8''x8'' | 10''x10'' | 12''x12'' | 18''x18'' | 20''x20'' |
| | 4/6 | 6/9 | 9/6 | 14/- | 30/- | 35/- |
| రేసు గ 1కి | 1/2'' | 1'' | $1\frac{1}{2}$'' | 2'' | $2\frac{1}{2}$'' | 3'' |
| | 3/3 | 6/6 | 10/- | 13/- | 16/9 | 25/- |

| | | |
|---|---|---|
| [illegible] సెట్లు | 8''(ఒకటి) 10'' ( [illegible]) 8'' (ఆరు) 6'' (ఆరు) | 145/- |
| [illegible] | 12''x18'' ( [illegible]) 12''x30'' ([illegible]) | 396/- |
| [illegible] లేసుపనులు ([illegible]) | | |
| [illegible] | 12''x18'' ( [illegible]) 6''x10'' (రెండు) | 60/- |
| [illegible] | 18'' 6'' (రెండు) | 30/- |
| [illegible] | 60''x90'' 72''x110'' 80''x120'' | |
| | 630/- 850/- 956/- | |



# బొమ్మలు

కొన్ని శతాబ్దముల నుండి కొయ్య బొమ్మల పరిశ్రమ ఆంధ్ర ప్రదేశ్‌లో సాంప్రదాయముగ వస్తూవున్నది. వేనకువేల పనివారలకు ఈ పరిశ్రమ జీవనోపాధి కల్పిస్తున్నది. ఈ పరిశ్రమలో పేర్కొనదగినవి కొండపల్లి బొమ్మలు, నిర్మల్, ఏటి కొప్పాక, తిరుపతి బొమ్మలు. ఈ బొమ్మలలో పని వారల నేర్పరితనము, కళాచాతుర్యము ప్రస్ఫుటముగా గోచరించి వారి ప్రజ్ఞావిశేషములను చాటును. హిందూ మత సాంప్రదాయముల ప్రభావము ఈ బొమ్మల శిల్పములో ప్రస్ఫుటముగా గోచరిస్తుంది. పౌరాణిక సంబంధమైన, మత సంబంధమైన బొమ్మలు సర్వసామాన్యముగా తయారు చేయబడుతున్నవి. ఇదిగాక మనుజులు, పశుపక్ష్యాదులు, ఫలపుష్పముల ననుకరించి చేయబడిన బొమ్మలు గూడ చేయబడుతున్నవి. గృహములు, పళ్లెరములు, రైల్వే ఇంజన్లు మొదలగునవెన్నియో



రకముల బొమ్మలు బాలుర వినోద విజ్ఞానముల కుపకరించేవి కూడ తయారగుతున్నవి. నిర్మల్, కొండపల్లి బొమ్మలలో నుపయోగించు ప్రస్ఫుటమైన రంగులు, ఏటికొప్పాక బొమ్మలలోని పుణికి చెక్కమీద చేసిన లక్క పనితనము చూపరుల దృష్టి నిట్టే ఆకర్షిస్తుంది. అందువలననే ఈ బొమ్మలు అందరి ఆదరణకు పాత్రమగుతున్నవి.

తిరుపతి చందనపు బొమ్మలలో ప్రత్యేక విశిష్టత ఉన్నది. మానవ ప్రతిమలు; దేవతలు; పురాణ సంబంధమైన ప్రతిమలు తిరుపతి బొమ్మలలో విరివిగా ఉన్నవి. మిగత రకపుబొమ్మలు అవి చేయబడే చెక్కపై రంగులు పూసి అందముగా తయారు చేస్తున్నారు. ఈ తిరుపతి బొమ్మలలో ఆ విధముగా గాక, చెక్కయొక్క రంగులో ఏ విధమైన మార్పులు తీసుకురాబడవు.

ఇటీవల సంవత్సరములలో మచిలీపట్టణ సమీప గ్రామములలో మరొక బొమ్మల పరిశ్రమ ఆరంభమైనది. మట్టితోనూ. గట్టికాగితపు అట్టలతోనూ చేయబడిన రంగు రంగుల బొమ్మలు అనేక రకములు తయారగుతున్నవి. సింహపురి బొమ్మలు అని వ్యవహరింపబడే పింగాణి బొమ్మలుకూడ నెల్లూరులో ఈ మధ్యనుండి తయారగుతున్నవి.

### ఏటా ఇతర రాష్ట్రములకు ఎగుమతికి తయారగుచున్న బొమ్మల మొత్తపువిలువ రూ. 50,000

## కొండపల్లి బొమ్మలు

| | | | |
|---|---|---|---|
| 1. | వివిధమగు జీవన వృత్తులుగల మనుజుల బొమ్మలు 2″ సైజువి 24 గల 1 పెట్టె | | |
| | నీటిరంగులు వేయబడినవి. | ... | రూ. 9—7 |
| | ,, ,, వార్నీషు రంగు వేయబడినవి | ... | 12—50 |
| 2. | 4″ సైజు బొమ్మలు - 24 గల పెట్టెలు-నీటిరంగులు వేసినవి | ... | 10—55 |
| | ,, ,, వార్నీషు రంగులు వేసినవి | ... | 14—00 |
| 3. | 1″ సైజువి ,, వార్నీషు రంగులు వేసినవి | ... | 25—00 |
| 4. | 6″ సైజువి విడిగా 1కి | ... | 1—37 |
| 5. | పశుల బొమ్మలు | ... | 1—25 |
| 6. | ఏనుగంబారీ బొమ్మ - 4″ | ... | 8—50 |
| 7. | ,, - 6″ | ... | 12—50 |
| 8. | 4″ దశావతారముల బొమ్మల సెట్టు | ... | 32—00 |
| 9. | 6″ ,, ,, | ... | 45—00 |
| 10. | వస్త్రములనేయుటనుచూపు 13 భంగిమలుగల బొమ్మలసెట్టు | ... | 45—00 |

# నిర్మల్ బొమ్మలు

1. పెద్దపులులు, సింహములు, ఏనుగులు, లేళ్లు, గుర్రములు, చిరుతలు, కుందేళ్లు, కుక్కలు, ఆవులు, దూడలు మొదలగు జంతువుల బొమ్మలు సైజు 12″ 1కి — రూ. 3-57 నుండి 6-00
   సైజు 6″ 1కి — రూ. 2-31 నుండి 4-50
2. పక్షుల బొమ్మలు వివిధములైనవి 4″; 6″ ల సైజులవి 1కి — రూ. 1-28 నుండి 1-67 వరకు
3. ఫలములు, కూరగాయల బొమ్మలు 1కి ... 0-37

# నిర్మల్ పరికరములు

ఆదిలాబాదు జిల్లాలో గుట్టలు, చిట్టడవుల పరిసర ప్రాంతముల నున్న నిర్మల్ చిత్రమైన రంగులతో విలసిల్లు చేతి పరిశ్రమల కాలవాలమైన గ్రామము. వివిధములైన నమూనాలు, స్వరూపములు ఈ పరిశ్రమలో కానవచ్చును. కొన్ని ఔషధ మూలికల సాయమున సువర్ణమును ప్రత్యేక రసాయన ప్రక్రియ ద్వారా చేయవచ్చునను అభిప్రాయము ప్రాచీన కాలమున ప్రబలముగా ఉండేది. నిర్మల్ పరిసర ప్రాంతములలో కూడ ఈ అభీష్టసిద్ధికి కొన్ని రసాయనిక ప్రయోగములు చేయబడినవి. తత్ఫలితముగా నిజమైనసువర్ణములభింపకపోయినను సువర్ణమును బోలినరంగు శాశ్వతముగా నుండుటకు వీలైన రసాయనపదార్థము లభ్యమైనది.

నిర్మల్ పరిసరారణ్యములలో లభించు తేలికైన చెక్కతో అందమైన పక్షుల బొమ్మలు, జంతువుల బొమ్మలు, ఫలములు, కూరగాయల నమూనాలు, ఇతర అలంకరణ వస్తువులు తయారగుతున్నవి. వాస్తవిక వస్తువును, ఈ ఆకారములో తయారు చేసిన నిర్మల్ బొమ్మను ఒక దాని ప్రక్క నొకటి యుంచిన భేదము గుర్తించుటకు వీలుండదు. చెక్క ఫ్రేముల మీద లక్క పూత పనితో పాటు బంగారుపూత పని కూడ నిర్మల్ పరిశ్రమల లోని మరియొక ప్రత్యేకత.

*ఏటా ఇతర రాష్ట్రములకు ఎగుమతి చేయుటకు సిద్ధముగా నున్న నిర్మల్ పరికరముల*
*మొత్తపు విలువ - రెండు లక్షల రూపాయలు.*

1. నలుపు, ఎరుపు, మీగడ రంగులలో తీగలు, పువ్వులు డిజైనులు గల అలమారాలు రూ 1,500-00
2. నలుపు, ఎరుపు, మీగడ, బూడిద వర్ణములు పువ్వుల డిజైనులు గల మంచములు 475-00
3. స్వింగు సోఫాలు 2 కుర్చీలతో సహా నలుపు, ఎరుపు రంగులలో పువ్వుల డిజైనులు గలవి 600-0
4. బంగారు పూతలో వివిధములైన డిజైనులు గల సైడ్ బోర్డులు (రెండు) 1,500-00 నుండి 2,000-00
5. పూర్తి బంగారు పూత పనిగల సైడుబోర్డులు (రెండింటికి) 1,500 నుండి 1,750

| | | | |
|---|---|---|---|
| 6. | బంగారు పూత గల భోజనాల మేజా, 8 మందికి సరిపోవునది (ఎంబాసింగు పని గలది) .... | 500 | 675 |
| 7. | ,, ,, (సాదా పని గలది) .... | 450 | 500 |
| 8. | భోజనాల మేజా వద్ద వేయు కుర్చీ. నలుపు రంగు, బంగారు పూత పని గలది .... | 100 | 125 |
| 9. | డ్రెస్సింగు టేబిలు - నలుపు, ఎరుపు, క్రీమ్ రంగులలో పువ్వుల డిజైను గలది .... | 350 | 450 |
| 10. | వ్రాత బల్ల (పువ్వుల డిజైను గలది) ... | 200 | 250 |
| 11. | 4 చెక్కల గల స్క్రీనులు బంగారు పూత పని మీద అజంతా చిత్రములతో వివిధ రంగులు గలవి .... | | 1,000 |
| 12. | వివిధములగు చిత్తరువులు పువ్వుల డిజైనులు గల నలుపు రంగు 4 చెక్కల స్క్రీనులు .... | 550 | 650 |
| 13. | పద్మము, ఇతర డిజైనులు బంగారు పూత గల నలుపు రంగు 4 చెక్కల స్క్రీనులు .... | | 450 |
| 14. | 4 చెక్కల స్క్రీనులు సాదా బంగారు పూత పని గలవి పువ్వుల డిజైనులు గలవి ... | | 375 |
| 15, | ఫైర్ స్క్రీనులు, నలుపు రంగు గలవి (బంగారు పూత పద్మము మొదలగు చిత్రములు గలవి) .... | | 112 |
| 16. | నలుపు, ఎరుపురంగులలో దివాన్లు (తక్తులు) అజంతాశిల్పము బంగారు పూతలో గలది .... | | 350 |
| 17. | ఎరుపు రంగు దివాన్లు (బంగారు పూత గలది) .... | 200 | 250 |
| 18. | బంగారుపూత అజంతా శిల్పము గల నలుపు, ఎరుపు రంగు ఫ్రెంచి కుర్చీలు .... | 250 | 300 |
| 19. | పేము స్టూలు, బంగారు పూత అజంతా శిల్పము గలవి .... | | 150 |
| 20. | పొడుగాటి పేము స్టూలు బంగారు పూత గలవి .... | | 125 |



దొస్తి నిర్మల్ పరికరములు

21. ,, పేము స్టూలు ,, .... 100

22. చిన్న స్టూలు, అజంతా శిల్పము గలవి బంగారు పూత గలవి .... 140

23. నలుపు, రంగులలో చిన్న పేము స్టూలు వివిధ రంగుల అజంతా శిల్పము గలవి .... 100



నిర్మల్ పరికరముల నలంకరింపబడిన డ్రాయింగురూము



నిర్మల్ పరికరములతో అలంకరించిన పడక గది



నిర్మల్ పూలకుండీలు - టేబిల్ లైట్లు



నిర్మల్ పరికరముల నలంకరించిన భోజనశాల

| | | | |
|---|---|---|---|
| 24. | ,, ,, | .... | 80 |
| 25. | బంగారు పూత పనిమీద అజంతా శిల్పము గల టీపాయి | .... | 185 |
| 26. | ఎరుపు, నలుపు వర్ణములలో వివిధ చిత్రములు గలవి | .... | 100 |
| 27. | కాఫీ టేబిల్ నలుపు, ఎరుపు రంగు అజంతా శిల్పము గలవి | .... | 150 |
| 28. | ,, ,, ,, వివిధ వర్ణములవి | ... 95 | 100 |
| 30. | కాఫీటేబిల్ నలుపు, ఎరుపు రంగులలో అజంతా చిత్రములు, ఇతర చిత్రములు గలవి | ... | 125 |
| 31. | స్టాండర్డు లాంపు స్టాండు నలుపు, ఎరుపు వర్ణములు, బంగారు పూత అజంతా చిత్రములు గలవి | ... | 150 |
| 32. | ,, ,, ఫోల్డింగు లాంపు స్టాండులు | ... | 165 |
| 33. | ,, ,, పద్మము ఎంబాస్ యచే బడినది | ... | 126 |
| 34 | ఫోల్డింగుల్యాంపు స్టాండులు వివిధ వర్ణములు, చిత్రములు గలవి | ... | 135 |
| 35 | పెగ్ టేబిల్ -నలుపు, ఎరుపు వర్ణములుగలవి, బంగారు పూతలో అజంతా చిత్రములు కలవి | ... | 72 |
| 36. | చేతులుగల కుర్చీలు, కుషన్‌లు గలవి నలుపు, ఎరుపు వర్ణములలో సున్నితమైన చిత్రములు గలవి | .... | 195—225 |
| 37, | నలుపు, ఎరుపు అనేకవర్ణములుగల రౌండు టేబిలు | ... | 195—225 |
| 38. | గుండ్రటి పేముకుర్చీ స్టీలు ఫ్రేముగలది, నలుపు, ఎరుపు, ఆకుపచ్చ రంగులలో | ... | 35 |
| 39. | 32"x22'' గోడచిత్రములు "బ్లాక్ ప్రిన్‌సెస్" ("నల్లయువరాణి") అజంతాచిత్రము ప్రత్యేక పెయింటింగు చేయబడినది | ... | 300 |
| 40. | 'బ్లాక్ ప్రిన్స్‌స్' చుట్టూ బంగారు పూతపనిమాత్రమే గలది | ... | 112 |
| 41. | "యశోధర అలంకరణ" అజంతా చిత్రము | ... | 250 |
| 42. | ,, ,, బంగారు పూతపనిమాత్రమే గలది | ... | 75 |
| 43. | వివిధ కుడ్యచిత్రములు 24″ × 17″ | ... | 50-60 |
| 44. | వివిధ వర్ణములుగల కుడ్యచిత్రములు | ... | 125-150 |
| 45. | 10″×12″ సైజు కుడ్య చిత్రములు | ... | 36-75 |
| 46. | సలాడ్ గిన్నెలు | ... | 21-37 |
| 47. | వివిధ సైజుల సలాడ్ చిన్న పళ్ళెములు | ... | 15-125 |

| | | | |
|---|---|---|---|
| 48. | నట్ ప్లేటులు | ... | 7-3 |
| 49. | టేబిల్ ల్యాంపులు-వివిధ డిజైనులు | ... | 21-95 |
| 50. | వాల్ బ్రాకెట్ ల్యాంపులు | ... | 54 |
| 51. | గోడకు తగిలించు పూలకూజాలు | ... | 21-33 |
| 52. | కొవ్వొత్తి స్టాండులు సాధారణపువి | ... | 18 |
| 53. | ,, ,, (ఎలక్ట్రిక్ ఫిట్టింగు గలవి | ... | 21 |
| 54. | టెలిఫోను స్టాండులు | ... | 24 |
| 55. | ట్రేలు లోహపువి; చెక్కవి సైజు 12″×15″&28″×17 | ... | 15-78 |
| 56. | ఫింగర్ బౌల్సు | ... | 4-8 |
| 57. | సాల్ట్ సెట్టులు | ... | 9-12 |
| 58. | పుస్తకములనుంచు చెక్కలు (నలుపు, ఎరుపు, బ్రౌను రంగులలో) | ... | 15-30 |
| 59. | వివిధ సైజులు, చిత్రములుగల సిగరెట్ కేసులు | ... | 12-36 |
| 60. | కార్డు బాక్సు | ... | 12 |
| 61. | లిప్‌స్టిక్ పెట్టె | ... | 6-10 |
| 62. | ఆష్‌ట్రేలు | ... | 10 |
| 63. | కాఫీకప్పు, సాసర్ | ... | 7-8 |
| 64. | నలుపు, ఎరుపు, బంగారు పూతపనిగల ఫొటో ఫ్రేములు | ... | 12 |
| 65. | భోజనముచేయునపు డుపయోగించు చాప | ... | 8 |
| 66. | సిరాబుడ్డి స్టాండు బంగారు పూతపని కలది | ... | 30 |
| 67. | పిన్ కుషన్ | ... | 6 |
| 68. | పేపర్ కట్టర్ | ... | 10 |
| 69. | క్యాలెండరు స్టాండు | ... | 21 |
| 70. | కలము | ... | 5 |
| 71. | బ్లాటింగుపేపరు చట్రము | ... | 10 |
| 72. | పేపరు వెయిటు | ... | 6-8 |
| 73. | అయిస్ క్రీము కప్పులు | ... | 5-50 |



హిమ్రూ వస్త్రములు

## హిమ్రూ వస్త్రములు

ప్రత్యేకంగా నేయబడిన జపులునేత ఎరుపురంగుల సాటిన్ గుడ్డమీదగాని, ట్విల్ గుడ్డమీదగాని అందమైన డిజైనులు వేసిన హిమ్రూ వస్త్రములు చేతిపరిశ్రమలలో నొక ప్రత్యేకస్థానము గలవి. కనులు మిరుమిట్లుగొలుపు ఎరుపు రంగుపై చిత్రవిచిత్రముల డిజైనులుగల హిమ్రూ వస్త్రములు, బ్లౌసులు, జాకెట్లు, మొదలగు ఆకర్షణీయమగు స్త్రీల దుస్తులకు ఉపయోగపడును. డోరు కర్టెనులు, సోఫాలమీద కవరింగు వేయుటకు - మొదలగు ఎన్నియో ఉపయోగములకు

హిమ్రూ గుడ్డలు అందముగను, అలంకరణప్రాయముగను వుండును. ఈ మధ్యను హిమ్రూ శాలువలు ఎక్కువగా జనాదరణను పొందుతున్నవి.

| | | | |
|---|---|---|---|
| 48″ పన్నా గల హిమ్రూవస్త్రము వివిధములగు | డిజైనులు | రూ. 8 నుండి 30 | గజము 1కి |
| 36″ పన్నా ,, | ,, | — 6 నుండి 25 | ,, 1కి |
| హిమ్రూశాలువలు | 36″ × 72″ | — 19 నుండి 22 | శాలువ 1కి |
| ,, | 36″ × 72″ | — 22 నుండి 25 | ,, ,, |
| ,, | 45″ × 90″ | — 35 నుండి 40 | ,, ,, |
| హిమ్రూ కర్టెనులు (తెరలు) | 45″ × 90″ | —15 నుండి 30 | ,, 1కి |



# తివాసీలు-కంబళ్లు (గొంగళ్లు)

తివాసీలు (రత్నకంబళములు) పరచుట వలన గదులకొక విధమైన అందము చేకూరును. నేలపై రత్నకంబళములు పరచుటవలన గదికి కలుగు ప్రత్యేకమగు వ్యక్తిత్వము, శోభ ఇతర అలంకరణవలన తరుగుటగాని, ఇనుమడించుటగాని కలుగజాలదు.

వరంగల్లు, ఏలూరు రత్నకంబళములు ఎన్నదగిన పనితనముకలవి. ఈ పరిశ్రమ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమున కొక గర్వకారణమని చెప్పవచ్చును. ఈ తివాసీల మీద వేయబడే డిజైనులు పర్షియన్ సాంప్రదాయము కలవిగా కన్పట్టును. కాని వీటిలో స్థానిక పరిసరముల ప్రభావము ప్రస్ఫుటముగా గోచరిస్తుంది. స్థానికముగా లభించే ఉన్నికి కావలసిన రంగులువేసి వివిధము లగు డిజైనులతో తివాసీలు తయారుకాబడుతున్నవి.

లండన్‌లో 1857లో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్య ప్రదర్శనములో ఈ రత్న కంబళములు "దక్కన్ రగ్గులు" అనుపేరిట ప్రదర్శింపబడినవి. దీనిని బట్టి షుమారు 100 ఏండ్ల క్రితమే ఈ పరిశ్రమ ఖండాంతరఖ్యాతి గాంచినదని తెలుస్తుంది.

అనేకరకముల రత్నకంబళములు వివిధమైన నాణ్యముకలవి వరంగల్లు, ఏలూరు రకములలో సరసమైన ధరలకు లభిస్తవి. అందుచే అన్ని తరగతుల ప్రజల ఆదరణను ఈ పరిశ్రమ పొందగలుగుతున్నది. ఎగుమతియగు వస్తువులలో వీటికి మంచి గిరాకీకలదు.

ఏటా రాష్ట్రమునుండి ఎగుమతి చేయుటకు వీలగు
సరకు మొత్తపు వెల రూ. 8 లక్షలు.

ఉన్ని తివాసీలు

| రకము | | రంగు | రేటు (చదరపు అడుగు 1కి) రూ. న.పై |
|---|---|---|---|
| $3 \times 3\frac{1}{2}$ | ముడులుకలది | స్వాభావిక వర్ణము | 0—87 |
| ,, | ,, | రంగు, డిజైనులు కలది | 0—97 |
| $4 \times 4$ | ,, | స్వాభావిక వర్ణము | 1—16 |
| ,, | ,, | రంగు, డిజైను కలది | 1—59 |

| | | | |
|---|---|---|---|
| 4½ × 4½ | ,, | పూర్తిరంగు, డిజైనుకలది | 2—37 |
| ,, | ,, | లేత రంగులు | 2—75 |
| 6 × 6 | ,, | స్వాభావిక వర్ణము | 2—31 నుండి 3—50 |
| ,, | ,, | రంగు, డిజైను | 2—75 ,, 4—00 |
| ,, | ,, | లేత రంగులు | 3—50 ,, 4—00 |
| ,, | ,, | పూర్తిరంగు, డిజైను | 3—25 ,, 3—75 |

వరంగల్ నూలు జంబుఖానాలు

| కౌంటు (నెంబరు) | రంగు | రేటు (చదరపు అడుగు 1కి) |
|---|---|---|
| 1½ కౌంటు | డైరెక్టు కలర్ | రూ. 0—59 |
| 1½ ,, | సల్ఫర్ కలర్ | ,, 0—78 |
| 6 ,, | డైరెక్టు కలర్ | ,, 0—78 |
| 6 ,, | నేఫ్తాల్ కలర్ | ,, 0—90 |
| 6 ,, | ఇండో గ్రీన్ | ,, 1—19 |



## పూసలు, గాజులు

ఆంధ్ర ప్రదేశ్‌లో పూసలు, గాజుల పరిశ్రమ బహుళ్యముగా సాగుచున్నది. చిత్తూరు జిల్లా పాపానాయుడు పేట పనివారలు ఆధునిక పరికరము లేమియు నుపయోగింపకయే తయారుచేస్తున్న పూసలు, గాజుల పనితనము ఇతర దేశములలోని నిపుణుల ప్రశంసలను కూడ అందుకొన్నది. చిత్తూరు జిల్లాలోని కాళహస్తి, పాపానాయుడుపేట, అనంతపూరు జిల్లాలోని గుత్తి, మహబూబ్‌నగర్ జిల్లాలోని గాజులపేట కేంద్రములు ఈ పరిశ్రమకు కేంద్ర స్థానములు.

## దంతము - కొమ్ము పనులు

విశాఖపట్నం, సికింద్రాబాదులలో దంతపు పనులు విస్తారముగా సాగుతున్నవి. పెద్దపెద్ద మేజాలమీద, బల్లలమీద అద్దంఫ్రేములమీద దంతముతో చేయబడిన అనేకరీతుల లతలు, విగ్రహములు పొదగబడి చూడ ముచ్చటగా అలంకరణ గావింపబడుతున్నవి.

మంచిగంధపుచెక్క పనిలో దంతపుపనికూడ కలిపివస్తువులు చేయు మరియొకపద్ధతి. నల్లచేవ మ్రానుచెక్క తాబేటిచిప్పతోచేయు వస్తువులమీద చిత్రాతిచిత్రమైన దంతపుపనులు పొదగబడి ముచ్చటైన అలంకరణ వస్తువులుగా ఉపయోగపడును. ఫొటోఫ్రేములు, వ్రాతచెక్కలు, వివిధాకారముల పెట్టెలు మొదలగు ఉపయోగకరమగు వస్తువు లెన్నిటిమీదనో దంతపుపనిచేయుటద్వారా సదరు వస్తువులు ఆకర్షణీయముగ తయారగుతున్నవి

కొమ్ము సంబంధమైన వస్తువులు అనేక రకములు. మామూలు ఉపయోగమునకు అలంకరణకు - ఇందనేక వస్తువులు తయారగుతున్నవి. పూలకూజాలు, టేబిల్ ల్యాంపు స్టాండులు, వివిధ భంగిమలలో పక్షులు, జంతువులు ఆష్ట్రేలు ఇంకా అనేక రకముల వస్తువులు కొమ్ము పనులలో కానవచ్చును.

## రాష్ట్రమునుండి ఎగుమతి చేయదగినవస్తువుల విలువ సం॥1కి రూ. 50,000

*దంతపు పనులు :*

| | | | | |
|---|---|---|---|---|
| దంతపు నగల పెట్టె | 15″ × 5″ × 5″ | 350-00 | నుండి | 400-00 |
| సిగరెట్లు, చుట్టల పెట్టె | $7\frac{1}{2}$″ × $5\frac{1}{2}$″ × 3″ | 110-00 | ,, | 120-00 |
| ,, కేసులు | $3\frac{1}{2}$″ × $2\frac{1}{2}$″ × $1\frac{1}{2}$″ | 21-00 | ,, | 25-00 |
| చిన్న ఆభరణముల పెట్టె | $5\frac{3}{4}$″ × $3\frac{3}{4}$″ × $2\frac{1}{4}$″ | 65-00 | ,, | 75-00 |
| స్టాంపు పెట్టెలు | $3\frac{3}{4}$″ × 2″ × 1″ | 8-75 | ,, | 10-00 |
| దేవతల విగ్రహాలు | 2″ to $4\frac{1}{2}$″ | 21-00 | ,, | 50-50 |



*దంతపు నగిషీ పని చేయబడిన వివిధ రకముల తాబేటి చిప్పలతో చేయబడిన వస్తు సామగ్రి.*




*కర్మాగారములో పనివారలు*

| | | తాబేటి చిప్పవి | మంచిగంధపుచెక్కవి |
|---|---|---|---|
| పెట్టెలు | 10″x4½″ | 27-50 | 29-50 |
| ,, | 9″x3½″ | 25-00 | 27-50 |
| ,, | 8″x3″ | 20-50 | 22-50 |
| ,, | 5″x3″ | 11-25 | 12-25 |
| ,, | 4½x″2½″ | 10-12 | 11-12 |
| ,, | 8″x6″ | 27-50 | 29-50 |
| ,, | 7″x5″ | 25-50 | 27-50 |
| ,, | 6″x4½″ | 20-50 | 22-50 |
| ,, | 4½″x3½″ | 15-75 | 16-75 |
| ,, | 3½″x2½″ | 6-75 | 7-75 |

*కొమ్ము పనులు*

| | | | | |
|---|---|---|---|---|
| కొంగలు | 7″ నుండి 9″ వరకు | 4-25 నుండి | | 5-00 |
| నెమళ్ళు | 7″ ,, 8″ ,, | 11-25 | ,, | 13-25 |
| కొంగలు (1 పెద్దది, 1 చిన్నది) | 12″ | 10-00 | ,, | 12-00 |
| పూల కూజాలు కొంగతో సహా | 6″—12″ | 10-25 | ,, | 18 |
| కొంగ చేపల సెట్టు | | | | 15-25 |
| చేప ఆకారపు ఆష్ట్రే | 10″-15″ | 8-75 | ,, | 12 |
| సింహాము, పెద్దపులి | 6″ | 6-12 | ,, | 7-75 |
| పీతలు | 10″-15″ | 0-7 | ,, | 15 |
| కలము స్టాండులు | | | | 4-25 |
| ఎలక్ట్రిక్ ల్యాంపు స్టాండు. కొంగతో సహా | 12″ | | | 30-00 |
| పూల కూజా | 2″ | | | 5-00 |

# అ ద్ద క ము లు

వస్త్రములపై అద్దకపుపని చేసే పరిశ్రమలో ఆంధ్రప్రదేశ్ చాల పురోగమించింది. ఈ అద్దకపు పనిలో రాష్ట్రమంతటా వేర్వేరు తీరులగు సాంకేతిక పద్ధతు లవలంబించబడుతున్నవి. కాని వేసే డిజైనులు స్థానిక సాంప్రదాయానుగుణముగా నున్నవి. ఈ సాంకేతిక పద్ధతులను స్థూలముగా మూడుతరగతులుగా విభజింపవచ్చును. 1. రెసిస్టు స్టైల్ లేక ఇండిగో ప్రాసెస్; 2. మోర్డెంటు 'డైడ్‌స్టైల్' లేక ఆలిజరైన్ పద్ధతి; 3. "పై అండ్ డై స్టైలు" పద్ధతి.

## 1. 'రెసిస్టు స్టైల్' లేక 'ఇండిగో ప్రాసెస్' (కలంకారి అద్దకములు)

బందరు కలంకారి అద్దకపు పరిశ్రమ ఈ పద్ధతికి సరియైన నిదర్శనము. స్థానికముగా లభించు కొన్ని మూలికలవలన రంగులు తయారుచేసి గుడ్డలపై అద్దకమున కుపయోగిస్తారు. ఈ పద్ధతిలో వస్త్రముపై కావలసిన డిజైను రంగుతో కుంచె నుపయోగించి వేస్తారు. (కలం). డిజైనులో తెల్లగా నుండవలసినచోటున మైనం పూయుదురు. అందువలన తెల్లగా వుండవలసినచోటున రంగు పట్టదు. రామాయణము, మహాభారతము మొదలగు పురాణ సంబంధమగు కథలు, చిత్రరూపమున వస్త్రములపై అద్దకము చేయబడును. ఇప్పటికినీ అనేక దేవాలయములలో కలంకారి అద్దకపు వస్త్రముల ముక్కలు కానవచ్చును. ఈ మధ్యన కలంకారీ అద్దకములో అందమైన అద్దకపు చీరలుకూడ వస్తున్నాయి. దుప్పట్లు, డోర్ కర్టెనులు, టేబిల్‌క్లాతులు అనేక డిజైనులు కలవి కలంకారి అద్దకములో వస్తున్నవి. చుట్టూ జరీగల వస్త్రములపై వివిధ డిజైనులలో చేసిన కలంకారి అద్దకపుపని చాల అందముగానుండి ఇంచుమించు "ఖేంఖాబ్"ను బోలియుండును. కలంకారి అద్దక వస్త్రములను విరివిగా ఎగుమతిచేయుటకు అవకాశములు గలవు.

## 2. "మోర్డెంట్" లేక "డైడ్‌స్టైల్"

ఈ పద్ధతిని "అలిజరైన్" పద్ధతి అనిగూడ అంటారు. దస్తర్‌ఖానాలు, గుడారముల కుపయోగించు గుడ్డల లైనింగులు, డోరుకర్టెనులు, తెరలు, కుషన్ల మీద కవరింగు వేయుటకు మొదలగు అనేకరకముల వస్త్రములపై అద్దకమునకు ఈ పద్ధతిని అవలంబిస్తారు. లంబాడీలు ఉపయోగించు దుప్పట్లు, దుస్తులపై



పోచంపల్లి జాకెట్లకు పనికివచ్చే వస్త్రము

మష్రూ వస్త్రము



కూడ అద్దకము చేయుటకు ఈ పద్ధతి అవలంబింపబడును. ఈ రకపు అద్దకపు దుస్తులు హైదరాబాదు ప్రాంతపు లంబాడీ స్త్రీలు విరివిగా ఉపయోగిస్తారు. ప్రకాశవంతమైన రంగుతోనూ, డిజైనులతోనూ ఈ వస్త్రములు కనులు మిరు మిట్లు గొలుపున ట్లుండును.

## 3. "టై అండ్ డై స్టైల్"

పై రెండు విధానములలో స్వదేశీపద్ధతు లనుసరింపబడుతున్నవి. కాని పోచంపల్లి, చీరాల అద్దకపు చీరలలో ఈ మూడవ విధాన మవలంబింపబడు తున్నది. వస్త్రము నేయుటకు కావలసిన పడుగు, పేకనూలు ముందుగానే నిర్ణయింపబడిన డిజైను ప్రకారము రంగువేసినపిమ్మట వస్త్రము నేయబడును. వస్త్రము నేసిన తరువాత ఏర్పడిన డిజైన్ సహజముగా అందముగా కనబడును. ఈ విధముగా అద్దకము చేయబడిన వస్త్రము పై రెండు విధానముల ద్వారా అద్దకము చేయబడినవాటికంటె మేలురకముగా నుండును. వస్త్రము నేయునపుడు డిజైనుప్రకారము రావలసిన వివిధరంగులనూలు పడుగుపేకల కుపయోగించుటవలన వస్త్రములు కనుల కింపుగా కానవచ్చును. పోచంపల్లి "తేలియా" రుమాలలు, చీరలు; చీరాల "ఆసియా" రుమాలలు; మిరియాల గూడెం చేనేత చీరలు ఈ విధానమున తయారగుతున్న వస్త్రములు.

---

## ఏటా రాష్ట్రమునుండి ఎగుమతి చేయదగిన అద్దకపు వస్త్రముల విలువ రూ. 2 లక్షలు

| | |
|---|---|
| చీరలు 6 గజములు × 45″ (ముల్తాని చీరలు) | రూ. 14 నుండి 18 |
| దుప్పట్లు 50″ × 90″ | 10—13 |
| డోర్ కర్టెనులు 45″ × 90″ | 9-50—13 |
| టేబిల్ క్లాత్ 36″ × 36″ | 3-50— 4 |
| ,, 36″ × 54″ | 5—8 |
| "టై అండ్ డై" పద్ధతిని పూర్తిగా అద్దకం వేసిన చీరలు 6గ॥ ×45″ | 13 - 30 |
| ,, ,, అంచులు, పమిటకొంగుకు మాత్రమే అద్దకం వేసినవి | 15—24 |
| టీపాయ్ గుడ్డలు 36″ × 36″ | 2-50—5-50 |
| డోర్ కర్టెన్లు 45″ ×90″ | 8—12 |
| చోలఖానాలు | 1-50— 3 |



*పేముతో చేయబడిన కుర్చీ, సోఫా, ఇతర పరికరములు*

## వెదురు, పేము పనులు

నాగరికతఆరంభమైనప్పటినుండి అనేక విధములుగ వెదురుకఱ్ఱ వుపయోగింప బడుతున్నది. కుర్చీలు, టేబిల్ లైటు స్టాండులు, బుట్టలు, మేజాలు, సోఫా సెట్లు మొదలగు పరికరములెన్నియో వెదురు కఱ్ఱ, పేములతో చేయబడుతున్నవి.



చుక్కలు, పువ్వులు డిజైనుగల చేనేత వస్త్రము

# నే త  వ స్త్ర ము లు

అందమునకు, డిజైనులకు, నాణ్యతకు ఆంధ్రప్రదేశ్ చేనేత వస్త్రములు భారతదేశ మంతటనూ ప్రసిద్ధి గాంచినవి. ప్రత్యేక విశిష్టతగల కొన్నిరకముల వివరములు దిగువ నీయబడినవి.

పోచంపల్లి చీరలు :

వీటిని గురించిన వివరములు ముందుపేజీలలో నీయబడినవి.

ఉప్పాడ, గద్వాల చీరలు :

నూలుమీద జల్తారుపనిచేసిన ఈ జరీ చీరలు చాల అందముగానుండి ఆకర్షణీయముగా నుండును. సరిగంచు, పమిటకొంగులు, బార్డర్లుగల ఈ అందమైన నూలు చీరలు ప్రత్యేక సందర్భములలో ధరించుటకు రమణీయముగ నుండును. వేసవికాలములోగూడ ధరించుట కాహ్లాదకరముగా నుండును. ఈ చీరలపై తగినట్టి చోళీలుగూడ దొరకును. ఇటీవల సంవత్సరములలో ప్రస్తుత అభిరుచుల కనుగుణముగా బుట్ట డిజైనులలో ఉప్పాడ చీరలు విస్తారంగా వస్తున్నాయి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గద్వాలచీరలు | 80 నెంబరు-100 | నెంబరు × 6 | గజములు | రు. | 40 నుండి 80 |
| ఉప్పాడచీరలు | ,, | ,, | ,, | | 12 నుండి 22 |

వెంకటగిరి, సిద్దిపేట చీరలు :

స్థానికంగా లభించు నూలుతో ప్రత్యేకముగా నేయబడిన ఈ జరీచీరల పనితనము చాల ఎన్నదగినది. చుక్కలు. గళ్ళు. పువ్వుల డిజైనులు అనేకములు ఈ చీరలలో తయారగుతున్నవి. మరొక విశేష మేమన ఇవి చాల చవుకధరలకు లభిస్తవి 80 నెంబరునుంచి 100 నెంబరు సిద్దిపేట, వెంకటగిరి 6 గజముల చీరలు డిజైనులనుబట్టి రూ. 12 నుండి 30 లు ఖరీ దుండును. జరీనిబట్టి వీటిధర ఇంకా అధికముగా నుండును. విస్తారంగా వాడుకలోనున్న సిద్దిపేట చోళీలు గ॥ 1కి రూ. 1-0-0 నుంచి 2-50 వరకు వుండును.

పట్టు చీరలు :

ఆంధ్రప్రదేశ్‌లో సిద్దిపేట, సంగారెడ్డి, ఆర్మూరు, నారాయణపేట, పెద్దాపురం, ధర్మవరములు పట్టుచీరలకు ప్రసిద్ధికెక్కినవి. ఈ చీరలలో గల పనితనము, నాణ్యము యాదృచ్ఛికముగా చూచినను దృష్టి నాకర్షించును. శుభకార్యములందు ధరించుటకు ఇవి ప్రత్యేకముగా నుపయోగింపవచ్చును. ప్రకాశవంతమగు రంగులు, భారీ జరీ పనితనముగల ఈ పట్టుచీరలకు భారతదేశమంతటా గిరాకీ గలదు.

## ఏటా ఎగుమతికిగల సరకుల మొత్తపువిలువ రూ. 2 లక్షలు

| | |
|---|---|
| చీరలు 6 గ॥ × 48″ | 35 — 180 |
| పట్టుగుడ్డ 45″ గ॥ 1కి | 4 — 9 |
| ,, 30″ గ॥ 1కి | 3 — 6 |

## వెండి నగిషీపనులు



*వెండి నగిషీపనిగల పౌడరు డబ్బా*

ఉత్తమశ్రేణి వెండి నగిషీ (ఫిలిగ్రా) వస్తువులకు కరీంనగర్ పూర్వము నుండి ప్రసిద్ధికెక్కినది. ఈనాడు ఈ పరిశ్రమ అపురూపమైపోయినది. వెండిని వేర్వేరు మంచములుగల తీగలుగా తయారుచేసి వివిధ రకముల వస్తువులు సున్నితమైన డిజైనులలో తయారుచేస్తారు. ఆష్ట్రేలు, పెట్టెలు, సిగరెట్ కేసులు, గాజులు, బ్రోచీలు, గుండీలు, అందమగు పాన్‌దానులు, చిలుక, నెమలి ఆకారములలో సుందరమగు అత్తర్‌దానులు మొదలగు పరికరము లెన్నియో తయారగుతున్నవి. నగిషీ చేసిన ఈ వెండి వస్తువులు ధరించువారికే గాక చూపరులకుగూడ ఆనందము కల్గించును.

### రాష్ట్రమునుండి ఏటా ఎగుమతి చేయదగిన వెండి నగిషీ సామానులు మొత్తము విలువ షుమారు రు. 60,000

వెండి నగిషీపెట్టెలు (నలుచదరము, గుండ్రము, కోల, దీర్ఘ చతురస్రాకారము) సైజు $3'' \times 2'' \times 1''$ నుండి $5'' \times 4'' \times 1\frac{1}{2}''$ 25 నుండి 75

| | | |
|---|---|---|
| పళ్ళెములు వివిధ సైజులు $4\frac{1}{2}'' \times 3''$ నుండి $6'' \times 4\frac{1}{2}''$ | 18 — | 35 |
| నెమలి,చిలుక, కొంగ ఆకారముగల అత్తర్‌దానులు $4\frac{1}{2}'' \times 6\frac{1}{2}''$ | 55 — | 80 |
| బుట్ట ఆకారపు అత్తర్‌దాను | 50 — | 65 |
| $6\frac{1}{2}''$ ఎత్తుగల పూల కూజా | 35 — | 45 |
| నెక్లేసులు | 13 — | 25 |
| వివిధ సైజుల బ్రోచీలు | 4 — | 10 |
| చెవుల ఆభరణములు | 3-50 — | 7 |

## మహబూబ్‌నగర్, నెల్లూరు చాపలు

నిత్యగృహోపయోగ పరికరములలో చాపల అవసరమునుగూర్చి వేరుగా చెప్ప నవసరం లేదు. ఒక ఉపయోగమునకుమాత్రమే గాక గృహాలంకరణకు కూడ ఈ చాపలు పనికివస్తున్నవి. రంగురంగుల చిత్రములతో విలసిల్లు చిరు చాపలు కుడ్యముల నలంకరించుటకును యింకను అనేక విధములుగా నుపయోగింపబడి ప్రజల ఆదరాభిమానములను చూరగొంటున్నవి.

భోజనములవద్ద వేయుటకు, కిటికీ తెరలుగా, ఇంక ననేక ఉపయోగములకు వీలుగా ఆర్డరు యిచ్చి తయారు చేయించుకో వచ్చును.

అల్లిక డిజైనులోని చాతుర్యము, నైపుణ్యము, నాణ్యతకు మహబూబ్‌నగర్ చాపలు భారతదేశమంతటా ప్రసిద్ధికెక్కినవి. మిగిలిన చేతి పరిశ్రమలలో వలెనే ఈ పరిశ్రమగూడ సహకారమార్గమున ప్రోత్సహింపబడుచున్నది.

### ఏటా ఎగుమతికిగల సరకుల మొత్తపు విలువ

### రూ. 24,000

| | 45''x6'' | 36''x6'' | 30''x6'' | 24''x6'' | 18''x6'' | 18''x18'' |
|---|---|---|---|---|---|---|
| మొదటిరకపుసాదా చాపలు అంచులుగలవి | 22-22 | 18-00 | 14-62 | 12-00 | 9-00 | 2-25 |
| ,, (రంగులవి) | 24-75 | 20-25 | 16-87 | 13-50 | 10-40 | 2-50 |
| రెండవరకము(సాదా అంచులుగలవి) | 4-22 | 3-37 | 2-81 | 2-39 | 2-11 | 0-99 |

రెండవరకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సగంరంగులు డిజైనులుగలవి | 7-87 | 5-62 | 3-94 | 2-81 | 2-39 | 1-27 |
| ,, పూర్తి రంగు, డిజైనులు | 10-12 | 7-87 | 4-78 | 3-37 | 2-81 | 1-27 |
| ,, రంగుఏమీలేనిది | 3-65 | 2-81 | 2-53 | 2-11 | 1-84 | 0-84 |
| మూడవరకంసాదా (అంచులుగలవి) | 3- 9 | 2-25 | 1-69 | 1-27 | 0-99 | 0-42 |
| ,, సగంరంగు, డిజైనులు | 6-75 | 4-50 | 2-81 | 1-69 | 1-27 | 0-53 |
| ,, పూర్తిరంగు డిజైనులు | 9-00 | 6-75 | 3-65 | 2-87 | 1-69 | 0-59 |
| ,, సాదారంగు ఏమీ లేనిది | 2-53 | 1-84 | 1-40 | 0-99 | 0-78 | 0-31 |

మొదటిరకము టేబిలు చాపలు 19 గల సెట్టు 1కి రూ. 9 నుండి 12 వరకు



# 1959 - 60 లో అమలులో నున్న చేతి వృత్తుల పథకాల వివరాలు.

| పథకం పేరు | గ్రాంటు | అప్పు | మొత్తం |
|---|---|---|---|
| 1. వరంగల్లులో తివాసీలు, కంబళ్ళ పరిశ్రమ అభివృద్ధి పథకం | 2,940 | — | 2,940 |
| 2. మహబూబు నగరంలో చాపల నేత అభివృద్ధి పథకం | 3,000 | — | 3,000 |
| 3. కరీం నగరంలో వెండి నగిషీ పరిశ్రమ అభివృద్ధి పథకం | 3.000 | — | 3,000 |
| 4. సికిందరాబాదులో దంతం, కొమ్ము పరిశ్రమాభివృద్ధి పథకం | 10.860 | — | 10,860 |
| 5. హైదరాబాదులోని ప్రభుత్వ కుటీర పరిశ్రమల అమ్మకం డిపో విస్తరణ, పునరుద్ధరణల పథకం | 52.200 | — | 52,200 |
| 6. జనగాంలో పూసల పని అభివృద్ధి పథకం | 5 400 | — | 5.400 |
| 7. బిద్రీ పనివారి శిక్షణా పథకం - సహకార పద్ధతిలో సమిష్టిగా వస్తూత్పత్తి సాధనకు వీలుగా | 8.100 | — | 8.100 |
| 9. చేతి పనులకు సిబ్బంది | 24,600 | — | 24,600 |
| 10. చేతి పనుల సర్వే పథకం | 17,618 | — | 17,618 |
| 11. తిరుచానూరులో కొయ్య బొమ్మల తయారీ కేంద్రం | 8,060 | 5,000 | 13,060 |
| 12. తిరుపతిలో అమ్మకం ఎంపోరియం స్థాపన పథకం | 9,000 | 10,000 | 19,000 |
| 13. నెల్లూరు, కోడూరు, తుమ్మపాలలలో వెదురు బుట్టల అల్లకం ప్రారంభానికుద్దేశించ బడిన పథకం | 6,000 | 12,000 | 18,000 |
| 14. గుంతకల్లు, అరకులలో వెదురు బుట్టల అల్లకం ప్రారంభానికుద్దేశించ బడిన పథకం | 4,000 | 6 000 | 10 000 |
| 15. ఏటికొప్పాకలో లక్క, కొయ్య బొమ్మల పరిశ్రమ ఆరంభానికి ఉద్దేశించ బడిన పథకం | 11,244 | 7,500 | 18,744 |
| 16. విశాఖపట్నంలో దంతం, తాబేటి చిప్ప, కొమ్ము పరిశ్రమ పథకం | 6,000 | — | 6,000 |

| | | | |
|---|---|---|---|
| 17. ఏలూరులో ఉన్ని, రంగుల కేంద్రం పథకం | 18,700 | — | 18,700 |
| 18. కొండపల్లి బొమ్మల తయారీలో శిక్షణను పథకం | 10,000 | — | 10,000 |
| 19. విజయవాడ కేంద్ర అమ్మకం ఎంపోరియంలో అంతర్‌రాష్ట్ర వస్తు విక్రయం పథకం | 6,700 | 15,000 | 21,700 |
| 20 మచిలీపట్నంలోని బల్యాల గూడెం సహకార క్రయ విక్రయ సంఘం ద్వారా కలంకారీ అద్దకం పరిశ్రమ అభివృద్ధి పథకం | 6,580 | — | 6,580 |
| 21. వరంగల్లులో ఒక రెండవ తరగతి సేకరణ - అమ్మకం డిపో స్థాపన పథకం | 16,500 | 12,000 | 28,500 |
| 22. విశాఖపట్నంలో ,, | 16,500 | 12,000 | 28,500 |
| 23. చీరాలలో సియా రుమాళ్ళ అభివృద్ధి పథకం | 6,600 | 6,000 | 12,600 |
| | | | *మంజూరీలో ఉంది.* |
| 24. కుప్పంలో జములి దుప్పటి పరిశ్రమ పథకం | 3,000 | — | 3,000 |
| 25. బొబ్బిలిలో వీణల తయారీ పథకం | 5,000 | — | 5,000 |

క్రొత్త పథకాలు :

| | | | |
|---|---|---|---|
| 26. అక్కడక్కడ చెదిరి ఉండి సహకార సంఘాలుగా ఏర్పడే అవకాశం లేని చేతి పని వారికి విడిగా గ్రాంటులు, అప్పులు యిచ్చే పథకం | 5,000 | — | 5,000 |
| 27. నిర్మల్‌లో నిర్మల్ బొమ్మల పరిశ్రమలో సమిష్టి వస్తూత్పత్తి సౌకర్యానికి కేంద్రం | 10,000 | — | 10,000 |
| 28. సంచార ప్రచార వ్యాన్ పథకం సిబ్బందియు సహా | 20,000 | — | 20,000 |
| 29. నాణ్యం గుర్తు వేసే పథకం | 10,000 | — | 10,000 |
| 30. ఖైరతాబాదు - హైదరాబాదులో నిర్మల్ పరిశ్రమ అభివృద్ధి పథకం | 61,600 | — | 61,600 |
| | | | *(మంజూరీలో ఉంది.)* |

31. చేతి పనులలో ఉపయోగానికై దేవాలయాల నమూనాలను సేక

| | | | |
|---|---|---|---|
| రించే పథకం | 5,000 | — | 5 000 |
| 32. నర్సాపురంలో లేసు పరిశ్రమ అభివృద్ధి పథకం | 10,000 | — | 10,000 |
| | | | (మంజూరీలో ఉంది.) |
| 33. అనంతపురంలో ఒక రెండవ తరగతి సేకరణ-అమ్మకం డిపో ఆరంభానికి ఉద్దేశించబడిన పథకం | 15,000 | 10,000 | 25,000 |
| 34. అక్కడక్కడ చెదిరి ఉండి సహకార సంఘంగా ఏర్పడ వీలులేని చేతి పనివారికి విడిగా గ్రాంటులు, అప్పులు ఇచ్చే పథకం | 5,000 | — | 5,000 |
| 35. పిఠాపురంలో సంగీత వాయిద్యాల పథకం | 3,000 | 2,000 | 5,000 |
| | | | (మంజూరీలో ఉంది.) |
| 36. మచిలీపట్నంలో కలంకారీ అద్దకానికి సమష్టి సౌకర్యం కలిగించే పథకం | 10,000 | — | 10,000 |
| 37. ఏలూరులో తివాసీ పరిశ్రమకు సమష్టి సౌకర్యం కలిగించే పథకం | 20,000 | — | 20,000 |
| 38. ఉదయగిరిలో కర్ర బొమ్మల తయారీ పథకం | 7,236 | — | 7,236 |
| | | | (మంజూరీలో ఉంది.) |
| 39. చేతి పరిశ్రమ వస్తువుల ప్రదర్శన - అద్దాల బీరువాలలో ఉంచుకునే ఏర్పాట్లు | 4,000 | — | 4,000 |
| | | | (మంజూరీలో ఉంది ) |
| 40. అరకులో వెదురు గడలకు సమష్టి సౌకర్యం కేంద్రం | 10,000 | — | 10,000 |
| 41. జగ్గయ్య పేటలో సంగీత వాయిద్యాల అభివృద్ధి పథకం | 5,000 | 3,000 | 8,000 |
| 42. సికిందరాబాదులో దంతం, కొమ్ము పరిశ్రమకు సమిష్టి సౌకర్యం కేంద్రం స్థాపన పథకం | 15,000 | — | 15,000 |
| 43. బ్లాక్ ప్రింటింగు పరిశ్రమ అభివృద్ధి పథకం | 9,000 | 6,000 | 15,000 |
| | | | (మంజూరీలో ఉంది.) |
| | 4, 93, 938 | 1, 06, 500 | 6, 00, 438 |

మన్నికకు, నాణ్యమునకు—

# ఆంధ్ర ప్రదేశ్ చేతి పరిశ్రమల పరికరములు

# చేనేత వస్త్రములు కొనండి

| చేతిపరిశ్రమల పరికరములు : | చేనేత వస్త్రములు |
|---|---|
| బిద్రి పరికరములు | ఆర్మూరు సిల్కులు |
| నిర్మల్ వస్తువులు | గద్వాల్ చీరలు |
| దంతపు మరియు కొమ్ముతో చేసిన | సిద్దిపేట చీరలు |
| వస్తువులు | పోచంపల్లి చీరలు |
| వెండి నగిషీపనులు | ఆమనగల్లు చీరలు |
| కొండపల్లి బొమ్మలు | హిమ్రూ వస్త్రములు |
| నిర్మల్ బొమ్మలు | గద్వాల్ చోల్కానులు |
| తిరుపతి బొమ్మలు | సిద్దిపేట చోల్కానులు |
| మట్టి బొమ్మలు | పోచంపల్లి, జనగాం ఖోల్కాన్లు |
| తోలుతో చేసిన వస్తువులు | తేలియా రుమాళ్లు |
| తివాసీలు, కంబళ్లు | కలంకారి అద్దకపు వస్త్రములు |
| చాపలు | పలువిధములుగా ఉపకరించు |
| పేము పరికరములు వగైరా | వివిధములైన వస్త్రములు, కర్టెనులు |
| నరసాపురం అల్లికలేసులు | వగైరా. |

లభించు స్థలము :

ప్రభుత్వ

చేతిపనులు, గృహపరిశ్రమల విక్రయశాల

గన్ ఫౌండ్రి, హైదరాబాదు. (ఆం. ప్ర.)

అమరావతి ప్రెస్, హైదరాబాదు.